కనిన వివేకి నైనఁ బడు వికావికనవ్వు "నహో! ధనంబు* దం
ధన మని తిట్టుఁ బామరులు దరిద్ర్యపుదాసు లౌరుల్ వివేకులే. ౩౪

ఉ॥ మూఁతను కత్తె పేరిడి రగుల్కొను కోపముకల్మిఁ గుంపటిన్
బోఁతినరీతి నెందులకొ పాడునుడుల్ జగదీశుఁ బల్కఁగా నీ
వాతివివేక మే మనఁగ వచ్చుఁ గుమారి విభుండు నిన్నటో
నీతికిఁ ద్రిప్పి దోసము గణింపక నాకయి ప్రోచుఁ గావుతన్ ౩౫

మ॥ "గురులన్ దూఱుట తప్పటంచు సుజనుల్ గొండాడ"లెక్కేమి దే
వర నే దూఱెద నే" నటంచుఁ గవితన్ బాటించు నీ తెల్వి కె
వ్వరు శోకింపరె? నీకు శ్రీయ మెటులో ప్రాపించుతన్ వేంకటే
శ్వరుఁడే నాకయి ప్రేమఁ జూపుచు భవద్వాచాలతల్ సైఁపుచున్. ౩౬

సీ॥ వేంకటేశ్వరుఁడు నీ వెకలితనం బోర్చి రక్షించుఁగాక మాపక్షముండి
యతని దేవేరి మహాలక్ష్మి పతికోప ముపశమింపించి నిన్నోముఁగాక

---

న నీరోగము మరల నంకురించెనని నుడివెనంట. ఆపలుకుల నిప్పటి రాజుగారాలిం
చి జరిమానాసహితముగా 1116రూపాయలను వేంకటేశ్వరులగుడికిఁ బంపఁగా నీస
తీమణి రుగ్మత్తయంతయుఁ దృటిలో నివారితమయ్యెనంట! ఆహా! వేంకటేశ్వరుని మ
హిమ చాలవర్ణనీయము కదా. నిక్కముగ భక్తి కలచోట దైవమహిమ కాన్పింపక
పోదు. (శ్రీవేదాంతదేశికస్వామివారిశ్లోకములు)

*శ్లో॥ శరీరపతనావధిప్రభునిషేవణాపాదనా,
దబింధనధనంజయప్రశమదం ధనం దంధనం
ధనంజయవివర్ధనం ధన ముదూఢగోవర్ధనం
సుసాధన మబాధనం సుమనసాం సమారాధనం. ౧

శ్లో॥ కాచాయ నీచం కమనీయవాచా, మోచాఫలస్వాదముచా న యాచే
స్థితేఽకుచేలే శ్రితమాకుచేలే, దయాకుచేలే ధనదక్కుచేలే. ౨

శ్లో॥ సిలం కిమనలం భవే దనల మౌదరం బాధితుం
పయఃప్రసృతిపూరకం కిము న ధారకం సారసం
అయత్నమలమల్లకం పథి పటచ్చరం కచ్చరం
భజన్తి విబుధా ముధా హ్యహహ కుక్షితః కుక్షితః. 3

ఆ దేవు రెండవ పైదలి భూదేవి క్షమ నిన్నుఁ జూచి శ్రీయ మిడుఁగాక
యతని ప్రేమ ఁడిచాన యాత్మజ బుద్ధి నీపై నుంచి నీల కాపాడుఁగాక
తే॥ గీ॥ అతని కావాన మగు వేంకటాచలంబు
నీదోషంగు లడంచి మన్నించి "వేంక
టపతి" యనెడుమాట సార్థకగతి నెనంగ
సద్యశముఁ బొందుటకు నిన్ను సాఁకుఁగాక. ౩౭

("దేవురుగొట్టువై బయలు దేఱుదు తిర్పతి వేం...")

ఉ॥ "దేవురుగొ" ట్టటంచు నల దేవుని దిట్టెడినీదు నాల్క-కున్
శ్రీకి భుఁ డల్లకుండుత న్నేవ యొనర్చెడి నాకునై సదా
నీ నెటు ప్రేలినన్ నయిచి నీకు శుభంబొడఁ గూర్చి నన్ను సం
భావన సేయుతన్ జగతిఁ బండితమండలి మెచ్చునట్లుగన్. ౩౮

మ॥ "పగనైనన్ వగనైనఁ బ్రాణభయమున్ బాపించియైనన్ సదా
భగవన్నామము పొదం పలఁచుటయ పోఁ భాగ్యంబు; ముక్తుండు వాఁ
డగు" నఁచున్ వచియించు గ్రంథములు; నీ వద్దేవునిందిట్టియే
ని గడించం గల పుణ్యహోత్రపదము న్నికర్మమ్ము సుమ్మర్భకా. ౩౯

మ॥ "చిరకాలమ్మునఁ గానిభక్తి మెయి నాసిం గొల్చి పొందంగ నే
రరు తద్దేవుని పాదదర్శనము; వైరం బూనుచో శీఘ్రమే
యగయం జాలుదు,, రచు విరిదు మది తథ్యమైనచో నీ కగున్
ద్వరలోఁ దిర్పతి వేంకటేశపదపద్మప్రాప్తి యాత్రాతిన్. ౪౦

(నీ।వదివజకీశ్వరుండవఁటా?...నీకొక యాయ్య.. వైష్ణవంబిడినవాఁడఁట)

మ॥ హరుఁడే కాఁ యలవేంకటేశ్వరుఁడు ము, నన్లోయగుంగాక నో
రఱుగన్ దిట్టితి రుష్టుఁ డయ్యె నతఁ; డీయత్యాహితం బౌఁగ నీ
గురుముఖ్యుండె గలండు దేశికుని కన్గొన్ గట్టి గుప్తత్వమున్
బారయన్ జేసెద వేది దిక్కు? * శివుఁడున్ బూనండ యప్పట్టునన్. ౪౧

మ॥ హరుఁడే దేశికు నడ్డఁ జాలఁ డనుచో నన్యామరశ్రేణికిం
దరమే? వాగలయంశ మింత గలధన్యమ్మన్యసంసారు లె

---

శ్లో॥ * శివక్రోధాద్గురుస్త్రాతా, గురుక్రోధాచ్ఛివో న చ। (గురుగీత)

వ్వరికేనిం దరమే? శరణ్య మిదియా వాక్రుత్తు నీవేంకటే
శ్వరుఁడే సూరియలవేంకటేశుఁడును గావన్ లేఁడ యొప్పట్టునన్. ౪౨

ఉ॥ "దేవుఁడె లేనిమానిసికి దేశికుఁ డెక్కడినుండివచ్చు" నం
చీవల నింత కాలమున కించుక బోధకు వచ్చెనేమొకో? నీ
చేవ, నెబాసురి నీపదను, నీ? వహవా? భవదాస్తికత్వ, మీ
త్రోవను బోవుసాహసికి ద్రోహము చేయఁగ రాని దుండునే. ౪౩

ఆ॥ వె॥ "అమ్మ చెవులు ద్రెంచునమలాత్ములకు నెందుఁ
బిన్నతల్లి చెవులు బీఱపూలుఁ
గావు" దేవుఁ డిట్టుగదు మానిసి కుపా
ధ్యాయుఁ డిట్టు లెంత తప్పిదంబు. ౪౪

(రాతికి అప్పకు మొక్కఁ జెల్లునే)

చ॥ తొలి నతఁడీశ్వరుం డగుచుఁ దోఁచియు వేంకటనప్రశక్తిఁ జె
న్నలరెను వెంకటేశుఁడుగ; నజ్ఞులగజ్జుల కేమి సోమయా
జులు మును గొల్చువేల్పువలెఁ జెమ్మతఁడౌ హరియౌన్ హరుండు; మూ
ర్ఖుల కతఁ డొక్క-రాయియు నగున్ దలదిమ్మ వదల్చుపట్టునన్. ౪౫

ఉ॥ రాతిని దిట్టి తా "నొకయరాతిని దిట్టితి" నంచు నెంచు నే
వీతనయుండు; వాఁ డొకట వేరను భారము గాఁగ నెత్తితో
రాతిని బిట్టు మొట్టియు "న రాతిని మొట్టితి" నంచు నెంచుఁ జూ
మ్మో? తనయారి వివేక మిటు లూరుచు నున్నది నాఁడు నాఁటికిన్. ౪౬

ఉ॥ రాతి కరాతి వైతి వలరాతిని దేవుఁడె యున్నచోఁ బురా
రాతి కరాతి వైతివి ధరం బది మైమయిఁ బోవ దమ్మరా
రాతి కరాతి వైతివి పురాతనవిజ్ఞులు రోసినట్టి దీ
భూతిమతంబు; దీనఁ బరభూతియు వక్త్రవిభూతియున్ జెడున్. ౪౭

చ॥ తిలకము లేనిమోము పితృదేవత లాదటఁ జూచి "యక్కటా!
తిల+కము మాకు నున్న" "యని తిట్టి శపింతు" రటం చెఱుంగ రే
యలఁతులు; వారి త్రోవఁబడి యర్భక? చక్కనియన్వయంబు తి
ప్పల కెరఁ జేసి తంచు వగవన్ వలసెన్ దెలిసెన్ భవద్గతుల్. ౪౮

---

తిల×కము, తిలోదకము,

(దేవుఁడవౌదువేని... వేంకటేశ్వరా)

ఉ॥ "దేవుఁడ వౌదువేని" యని దిట్టతనాన నెవో వచించి తా
దేవుని కింతమాత్రమునఁ దీవ్రత పుట్టదు ముందు మ్రొక్కి గా
మ్మావెనుకన్ నిరాదరణ కర్గము గమ్మఁ బు డేమి యౌనొ? యా
దేవునిదేవతాగరిమ తెల్ల మగు న్నిమిషమ్ములోపలన్. ౪౯

శా॥ నేనే యుంచుక చర్చ చేసితిని నీనేరంబు వారింప ;నీ
వేనూరో యొర వొంఁడు తెచ్చికొని యెంతేఁ బ్రేలు మా వేంకటే
శానుం డీయఱపుల్ గణింపఁడు శిలాసౌజన్యమే చూపు నీ
పై; నేమందువొ?* "యాదృశీ" యనెడివిద్వద్వాణి దుర్వాణియే. ౫౦

(మహమ్మదు విగ్రహపూజ గాదనెన్)

ఉ॥ స్వచ్ఛపువంశమున్ గణన సల్పక పెద్దలమాట లెక్కఁ లే
దిచ్ఛకు వచ్చినట్టులుగ నేవియొ పల్లవము ల్లిఖించి యే
మ్లేచ్ఛమతంబో పట్టి పయిమిక్కిలి దేవునిగూడఁ దిట్టి నం
వచ్ఛకలంబుకోన మిటు పాటుపడం దగునే కుమారకా. ౫౧

(విగ్రహారాధన సేయరెవ్వరు)

ఉ॥ విగ్రహమున్ ద్యజించి గురువిగ్రహమున్ దల కెత్తికొంటి నీ
కాగ్రహచార మిట్లయిన నావలకున్ జనదయ్యె నిన్ను నే
దో గ్రహ మెుందు చెడ్డదయి యోగ్యతకుం గడు దవ్వొనర్చె నీ
వాగ్రహతృప్తి కీమతము నందితి వంతయు నే నెఱుంగుదున్. ౫౨

(శంకరపాదుఁ డర్చకోపాసన నీసడించెను)

ఉ॥ కావలె భార్య, పుత్రులును గావలె, ద్రవ్యము గావలెన్, మఱిం
గావలె సౌఖ్యముల్; మఱియుఁ గావలెసర్వము, విగ్రహమ్ము పోఁ
గావలెనే కుమార? సరిగా విను "విగ్రహపూజనమ్ము మూ
ర్ఖావళి" కండు వేని యెటు లార్యులు శంకరముఖ్యులొప్పిరో. ౫౩

* శ్లో॥ యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ.

(వ్యాసమతంబు... నేఁను క్రొత్తగాఁ జేసినదానిగా దిది)

ఉ॥ వ్యాసులవారు సూత్రముల బ్రహ్మముఁ దెల్పి పురాణమందుఁ ద
ద్భాసురచిద్విలాసములభంగులు దెల్పినవారు; సూత్రవి
శ్వాసము చూపి తర్కగలసంగతులన్ ద్యజియించువారు స
న్న్యాసులు, భ్రష్టు లౌదురు గృహస్థు లటుల్ చరియింపఁ బూనినన్. ౫౪

ఉ॥ అన్నిటి కేకవాక్యత గనారసి చూచిన విగ్రహంబు సం
పన్నగృహస్థుకోసమనుభావము దేలెడి నిర్గుణాత్ము నై
క్లైన్నఁగ నేర్చు! వీఁడు గుణమే కడుముఖ్యము గాఁ జెలంగు నీ
సన్న యెఱుంగ రూరకయ జందెము ద్రెంపెడి గేస్తు లర్భకా. ౫౫

ఉ॥ వ్యాసులు బ్రహ్మముం దలఁచి యాతనివిగ్రహరూప మెం దెదో
రోసముఁ బూని తిట్టు మనిరో! విని రోయుదు రిట్టిత్రోవ జి
జ్ఞాసువు లర్భకా! యిటులు కానరకూనరబోధ సేయుఁ డా
వ్యాసుఁడు దీని నింక నొకవ్యాసు నుపాసితుఁ జేసి నేర్చితే ౫౬

ఉ॥ వ్యాసమతమ్ముఁ బట్టి యలబ్రహ్మముఁ గొల్తువు గాక యేడ దీ
మాసుమతంబు! దేవగురుకోపమహాపదవాప్తసర్వస
న్న్యాసకృతంబు; నీపలుకు లర్థములేని వపార్థపర్గనా
ఖ్యాసపువ్యాసముల్ గిలుకువారల కాఱులసారముల్ సుమీ. ౫౭

శా॥ వ్యాసుం డీమత మొప్పెనే! కటకటా! వ్యాసాశయం బెల్లు! స
న్న్యాసుల్ పోవుపథంబు గేస్తులకుఁ గా వ్యాసుండు శాసించు నే!
దాసీదాసకళత్రపుత్రవితతిన్ దౌదవ్వులం దోల కే
లా! సంసారికిఁ గర్మబంధ మది వాలాయమ్ము డీ లయ్యెడిన్. ౫౮

ఉ॥ శంకరు లొప్పినారు మతషట్కము; విగ్రహపూజయందు ని
శ్శంక మె షట్కమున్; జడులసంగతి నిప్పటియట్లు పాపపుం
బంకము గా జగంబు నిలుపన్ గమకించినయార్యుఁ డాతఁ డీ
శంకరుఁ బోఁడు వ్యాసమతసర్వరహస్యవిదుండు గాఁడొకో. ౫౯

క॥ శంకరమతమ్ము గా దిది, సంకరమత మైన నగును శంకరుఁ డెట్లా
శాంకరిని బీరమున ని, శ్శంకమ్ముగ నుంచి పూజ సల్పెఁ గుమార్గా. ౬౦

మ॥ తల బోడింబొనరించి జందెములు తద్దం ద్రెంచి "సన్న్యాసిపో
కలు గాఁ బోదు" మటంచు రెవ్వ రలవా రబ్జాక్షులన్ వీడరే
తలఁపుల్ మానరు "దేవళం" బనిన నిందల్ సేతు రీచెట్టపో
కలు నీ కేగతి నబ్బెఁ దెట్టుతుదకున్ గార్హస్థ్యసంచారికిన్. ౬౧

శా॥ ఏకర్మమ్మును వారు మానరుసుమీ! యాకర్మ మే తక్కు; నీ
వీకర్మం బన నేమిగాఁ దలఁచెదో? యేకర్మ మార్యుల్ ఋత
శ్లోకుల్ శ్రీకరు లప్పదీక్షితముఖుల్ శోధించిరో వేదవి
ద్యాకంజాతభవావతారు; లది యేతచ్ఛబ్దబోధ్య మా. ౬౨

శా॥ జ్ఞానప్రాప్తి కనేకమార్గములు విజ్ఞానుల్ ప్రసంగించఁగ
యాన్యానందాత్మని కిన్ని మార్గములు తుల్యంబుల్ సుమీ! విగ్రహ
ధీనుల్ గొంపెఱు గల్గుమాత్రమున నే దేశంబు గోసెత్తెనే?
జ్ఞానం బూరక కల్గునే! యదియు సంగర్లమ్ము క్రియ్యమ్మొకో ౬౩

మ॥ ఎచఁడో యొక్కరుని కబ్బెఁ గాక శ్రమ లేకే జ్ఞానసంపత్తి; యిం
కవనిన్ డక్కిన వారలెల్లరును నష్టౌవారె? యవ్వారికై
శివవిజ్ఞాన్యుదయముల్ చెలంగుతె మొటల్ శిష్యుండు నీ కన్నెనీ
యవివేకంపుమతంబు; దేవగురుసంధానందసంధాయియై. ౬౪

ఉ॥ వేదములందు లేదనుచు విగ్రహపూజన చెప్పరంటి? యా
వాదులు గొంద; ఱయ్యదియ వాస్తవ మందము మూఁడుపూటలున్
సాదము మెక్కి తుల్కుఁడని సారెకు వేదము లేడ్చుచున్నవే?
లేదట భుక్తికిన్ విధి; దుర్గీకను గాదది మానరాదొకో. ౬౫

శా॥ ఏమి? వేదము నంతమున్ దెలిసియే యామెట్టవేదాంతపుం
బూమె ల్వ్రాసెనె? దీనికిన్ ఫల మెందో పోనిమ్ము చాగింత మా
ర్యామోదం బది తప్పిపోవుట, యుపాధ్యాయాగ్రహోబాదగ్రసం
గ్రామగంథము నెత్తిపైఁ బసటయుం గాకన్యముం గల్గునే? ౬౬

చ॥ తిరుపతివేంకటేశ్వరుని దిట్టితివే యను చట్టితిట్లకున్
దురకలు దూదెకుల్ మఱియుఁ దొల్లిటిపెద్దలహద్దు లెట్టినా

యెఱుఁగని మోటకుల్ గద సహింతురు వీరల మెచ్చు నట్లు వీ
శ్వరులకు వారిశిష్యుల కనన్య మెఱుంగుటపో యెఱుంగవో. ౬౭

చ॥ ఇతరకులస్థుఁ డేమతము నేని గ్రహించిన నంత నష్టి లే
దతులము బ్రాహ్మణాన్వయమునం దుదయించి పితామహాదులున్
బితరులు వోవుమార్గములు విప్పిగ నెంచి స్వతంత్రులై శ్రుతి
స్మృతిధృతిదూరమైన గతిఁ జెందిన వారియవస్థ శోచ్యమౌ. ౬౮

క॥ రామానుజాదు లందఱు, నీమాత్రము తెల్వి లేకయే విగ్రహపూ
జామంత్రము లొప్పిరిగాని, యేమి సాహసము తుదకు నిందు దిగితివే. ౬౯

(సలాముఁ జేసి గుడిదూరెదు తిర్పతివేంకటేశ్వరా!)

చ॥ లలి మన వెంకటేశుఁడు "సలామిడు" నంటి "సలాం" పదమ్ము చేఁ
దెలియఁగ నయ్యె 'మలక్' కని; దేవుఁడు వానికి నల్గఁడే చుమీ!
"మలక పదమ్ము సాచి తను మట్టుదు నర్చకుఁ గొట్టె దేవి" యన్
వలుకు లెఱుంగవే తనయని భ్రష్టులతోఁ బనియేమి సామికిన్. ౭౦

(తలఁకుచు...దండము పెట్టఁగవచ్చువారినే తలగొఱిగించి...చెప్పుతో...గొట్టెదవు)

చ॥ తలఁకెడివారికే విభునిదండన, "మేనుఁగుఁ జూచి భీతిమైఁ
దలరెడిమానవుండె యొకతప్పన ముప్పన కగ్గమౌనుఁగా
కలగజరాజుమార్గమున నట్టె చలింపక యుండుతాటియా
కులచెడుచెత్తముకల్కులకుఁ గుంజరరాడ్భయ మేడ దర్భకా. ౭౧

చ॥ అపురని విచిత్ర, మింతటియనార్యమొకో కలి, బ్రహ్మశక్తి నం
భవులకు నంటని మలక్ల*యపాత్రపుఁగూఁతలు గీతలంటని హా
శివశివ రామరామ హరి శిష్టవిగర్హితమైనమార్గముం
దవిలిన శిష్యునిన్ మనిచి ధర్మ్యపథమ్మునఁ బెట్టబోరివరే. ౭౨

---

(*రద్దేహిందూనుండి.)

సీ॥ కోతిరూపంబైన పోతుహన్మంతునూ వేపార్లు దైవమని వేడుకొనిరి....
అడ్డబొట్లందరూ "హరాహరా, బలిక్రీ సుద్దబొట్లంత హరి పెద్దయనిరి,...కొం

శా॥ సారాచారవిచారదక్ష మగువంశమ్మందు జన్మించి ని
స్సారుల్ మలకాబు వోపుమార్గముల నిచ్చల్ సంచునీచైదిచే
ధీరుల్ దూఱక యుందురే కటకటా! "దీన్ కూపులా" వారికిన్.
వీకల్ దాసులు, వారిబాగ తుద కబ్బెన్ వీరి కంచుక్ సుతా!. ౨౩

(లభించినమాయకీర్తికిన్ భంగమువచ్చె నీహిమ పాడ్వాడె)

చ॥ తిరుపతివేంకటేశ్వరుని దేవళ మూడినమీఁదఁ గాని యీ
తిరుపతివేంకటేశునిప్రతిష్ఠకు భంగము శేమి తేలె నెం
దఱు మలకల్ ప్రయత్నపడి తప్పిన్వన పిమ్మటఁగూడ దేవళా
లాగుగక నిల్పియున్నయవి కాలా విని యుండవుగాక యర్భకా. ౨౪

(ముంగలవారు...దైవ మటంచు నిన్ గొనియాడువార లవి నేఁ
టికి బూటక మయ్యె)

చ॥ ఎఱిఁగియు నోర్వలేని జడుఁ లేవిను ప్రేమఁగినయంతమాత్రనే
"తిరుపతివేంకటేశ్వరుప్రతిష్ఠకు భంగము గల్గె" నంచు నీ

---

తెలందరుగూడి కృష్ణు డనిరి...॥ ౮॥ సీ॥...పంచితము పేడలే బహుశుద్ధి అనుకొని యిల్లువాకిళ్ళెల్ల చల్లుకొనిరి,...భగవతాభక్తులు బారుగా చూనుకొని విగ్రహపూజలే యిష్టమనిరి, మలమూత్రమే దోషములు తీర్చునుకొని పేడవుండలు పంచితాలు తినిరి...శిలలు బొమ్మలు మిమ్ము రక్షించగలవా ... ౧౦॥ సీ॥ పార్వతీదేవిపై భస్మాసురుడు మోహించి దానిమొగునిని చంప తరిమినాడు, ... యింతనుండల బోతును యీశ్వరుడనక, కొల్వవలెనయ్య అజ్ఞానుక్రమముగాను। ౧౬॥...సీ॥... సీ॥ భిడియపడరయ్య దైవముకు రుఘయగయ్య, ముద్దిపూజలు యిఖనైన మానివేశి, ...౧౯॥ సీ॥...భాగవతమును బట్టి పలుగు కృష్ణుని చరితు నిజము ప్రాసితివయ్య సుజనులార,...౨౦॥ సీ॥ రామాయణము రంకు భారతం బేబొంకు గొల్లభాగవతంబు పొల్లు చనుచు,... తే॥ ఇహములో నొకర్ ఖురఅను హెచ్చయనుచూ, సత్యపురుషులు చెప్పిరీజగతియందు ...॥ ౨౧। సీ॥... మొహమ్మదు.. దేవతులనైననూ...రాక్షసులైనా, పూజింపకూడదని బోధించి చెప్పినామాన లేదు,...॥ ౨౨॥ సీ॥ కుడివరాగ్రంథమే ఖురఆను ఘనముయా యితరగ్రంథములన్ని యొడమనుంచి,...॥ ౨౬॥

వలచె దుపాంగమై "జలధి యంతయుఁ గల్లనుకొను మయ్యరొ ద
క్రౌరిగతి నేమి యడ్డు భషకప్రికర ప్రకటారవార్భటుల్ ౨౬

శా॥ అబ్బాయీ! నినుఁబంటివాఁ డొకఁడు మర్యాదల్ దిగం ద్రావి యే
కబ్బంబో యొకఁడల్లినంత నది నిక్కంబై జగజ్జాలముల్
తబ్బిబ్బైనను బోనికీర్తి గలభూధ్రిస్వామి కెగ్గౌనె? యే
మబ్బా! సూర్యుని బుగ్గిచే నడఁచు దేవయ్యల్ ధరన్ గల్గిరే. ౨౭

ఆ॥వె॥ అర్థశతకమ్ము తుదకు ననర్థశతక, మగును సంపూర్తిఁ జెందినయట్టికతన
నప్పుడునుగూడ నీజోలి కతఁడు రాఁడు, భయపడక తక్కుఁ సగమెట్లొ పాడుమబ్బ

ఉ॥ "తీతువుపిట్ట యభ్రిము క్షితిం బడకుండఁగ నాఁగునంటె? వీం
కేటి తనయా! యటుల్ సుమి నగేశుయశం బది వోక యుంటకై
కైతయొకింత డాఁతు ననుగర్వపుఁ బ్రిల్లవముల్ యథార్థమా
ఖ్యాతియ యేని దుర్భగులకాఁ డులుదాని నడంప నేర్చునే. ౨౮

(నీకుఁ గలట్టిపాత్రిధిమం బందఱులోన మెచ్చు కొనునట్టియుకా
లము సంభవించె)

ఉ॥ ముందఱమెచ్చుమెప్పు లవి ముప్పులుగా నెఱుఁగం దగున్ యశం
బందఱు లోన మెచ్చుకొనినప్పుడ యా నెటువంటిపందను
న్ముందఱ మేల్ బళీ! యనియు మో మటుత్రిప్పి" యపాత్రుఁ డీతనిన్
గందుమయేని పాతకము గల్గు" నటందురుగాదె పుత్రికా. ౨౯

ఉ॥ చిందులు ద్రొక్కి "నేను గురుశేఖరుఁ డిట్టుట కిట్లు దేవతా
నిందకుఁ బూనుకొంటి" నన నీకడనే "నరిగా" దటంచు ప్రోరి
కొందఱు, కొందఱో! మొగము కొండొక ద్రిప్పినమీఁద నేమిగా
నందురొ నీ వెఱింగినరహస్యమె నే వచియింప నేటికిన్. ౩౦

ఉ॥ మానసమే ప్రధాన మగు మానిసి; కందలిభక్తి భక్తి, యం
దూనినపూజ పూజ, యది యొప్పినమె చ్చది మెచ్చు, దాని కిం

---

సీ॥...గోమాంసములుమాకు గోమయంబేమీకు పాలుమాకును పంచితాలుమీకు॥...
ర.అ॥సీ॥...గీ॥శంకరాచారి చేసె మీసంకరంబు,...ర.అ॥...॥(ముక్తికిముక్తినకలు)

హైనది యింపు. దీనికి సమస్తజగమ్ములను సమ్మతించు, నీ
మానసమేని యొప్ప నది మాత్రము బ్రహ్మ సృజింపకుండెనే. ౧౧

మ॥ మునుకొన్నాళ్లు త్రిశుద్ధిగా సతత మమూర్తిన్ బ్రశంసించి నేఁ
డనిశమ్మున్ మది నెంచుచున్ బయికి నన్యాయమ్ములన్ గ్రిక్కి యీ
యనయ మ్మారిరో కట్టి పెట్టెదవె? నీయాంతర్య మట్లౌనుఁగా
కనఘుల్ తక్కినవారి కట్లగుట కేమత్యాహితం బర్భకా. ౧౨

(నవ్యులు నీవు ద్వైవత మన న్నగువారలు)

క॥ నవ్యుండడు గాఁడె శిష్టా, కవ్యగ్రణి హనుమదాఖ్య గలబుధుఁ డెటు సం
స్తవ్యునిగ వేంకటేశ్వరు, నవ్యయు నుతియించెఁ జెప్ప మర్భక? వాకున్. ౧౩

---

(1914 సం॥ ఫిబ్రవరి అభినవసరస్వతినుండి)

# తిరుపతి వేంకటేశ్వరతత్త్వము.

చ॥ "తిరుపతి వేంకటేశ్వరుఁడు దేవుఁడు కాఁ"డని తిట్టుచున్న యా
పురుషులనైతమున్ ముడుపుమూటలు కట్టినటుల్ పొనర్చి నీ
గిరికరు దేర బుద్ధిగొలిగించి పదింపడి చెప్పదెబ్బ లే
ద్దెలు నపరాధశిక్షగ విధింతువు తిర్పతి వేంకటేశ్వరా. ౧

ఉ॥ నీమహిమం బెటుంగని వినీతులు కొందఱు నిన్ను దూఱ నో
సామము చేతనో! భయరసంబునసో! మరలించి వారికిం
గామిత మీఁగ డెంగెదవ కాని నిజంబుగ నీవయుల్గినన్
భూమిపులైన భస్మమయిపోరొ కొ! తిర్పతి వేంకటేశ్వరా. ౨

చ॥ వ్రణములొనర్చిరేని తులుకల్ పొనరించెడ దుష్టచేష్టలం
గణనమొనర్పఁబోకుమి, యొకానొకఁ డట్టులొనర్పకున్న న
ద్గుణరహితున్ సహింపకుమి. కోవిదులేగును దాన నిన్ను దు
ర్గుణుఁడనఁబోవ, రీ పథ మెఱుంగుము॥ తిర్ప. ౩

ఉ॥ భక్తులయందు నీకుఁ గలసారము లేనికృపారసంబు సం
రక్తియుఁ జూపుపొందె నపరాధులనేరము వారినోట సా

మోక్తులచేత ముందు వినకున్న ఖరోక్తులచేతఁ బిమ్మటన్
వ్యక్తముఁజేసి గ్రొక్కఁబడులందెదు॥ తిర్ప. ౪

చ॥ అవమతినీకుఁజేసెడు దురాత్ములగర్వ మడంప నెల్లమా
నవులును బూనియుండుతరుణమ్మునఁ దద్భర మేల నీకు? వా
స్తవమిది సేనగల్గునృపసత్తముఁ డెవ్వఁడయేని తాన శా
త్రవుల నదల్చుపూనికను దాల్చునె॥ తిర్ప. ౫

ఉ॥ దైవమవైననీయెడలఁ "దప్పులు గల్గ"నటంచుఁ బల్కఁబ
ల్కఁవలువైన వారిపయిఁగారుణికత్వముఁ జూపఁబోకు మ
య్యా! విధిగానఁ జెప్పితిని నాగిరిమామొందకుమయ్య? నేతకున్
సేవకులైన వారలు వచింపరె॥ తిర్ప. ౬

చ॥ ఎఱుఁగక నీప్రతాపము, సహింపక నీఘనగౌరవంబు, కా
ర్లఱచుచుఁ బ్రతికావళులనంపియు నీదు సుదర్శనస్ఫుర
త్తరళగవీవరంపరకుఁదాళక చొచ్చిరి సూర్యమండలో
పరిపథమందు దైత్యకవిపక్షులు॥ తిర్ప. ౭

ఉ॥ దేవుని నిన్నుఁదిట్టు దురదృష్టులు లేరొకొ! మున్ను, దానిచే
నీవహితగ్గనే? యిపు డనేకులు తావకదివ్యజంఘికా
పీవరకేశలేశమును బీఁకఁగలారె? భవత్ప్రతిష్ఠయుం
బోవుట యీజగంబు నరిపోవుట॥ తిర్ప. ౮

ఉ॥ భావమునందుఁ జంచలతఁబాయఁగ దేవుని రాతియందు సం
భావన చేసినారు మును ప్రాజ్ఞులు, కాని నవీను లట్టి సం
భావన సేయఁజాలరఁట??? భార్యయుఁ దల్లియు నంచు భేదసం
భావన యెట్టుచేసెదరొ వారలు॥ తిర్ప. ౯

చ॥ "గురువును దైవమున్ మనకుఁగూడ" దటంచు వచించువారికిం
దిరుపతివేంకటేశ్వరుఁడు దేవుఁడుకాఁడు యథార్థవస్తు త
త్పరులగువారికిన్ గలఁడు దైవము తిర్పతివేంకటేశ్వరుం
డరమరలేక నీ వరయుమా యిది॥ తిర్ప. ౧౦

ఉ॥ దేశికుఁడంచు నిన్ను వినుతించెడివారిపయిం గృపారసా
వేశముఁజూపుమయ్య, యొకవెంబడగొట్టు నుతింపఁ డేనినీ

వాశరునికి సహించిన మహాత్ములునవ్వరు రట్లుగాన నో
యీశుడ! తగ్గశిక్ష విధియింపుము॥ తిర్ప. ౧౧

చ॥ తెలియక నీవ్రతాతమము, మదిందలపోయక నీమహత్త్వముం
బలువలు తిట్ట నాపదలు వచ్చిన వేళల నీపదాబ్జముల్
గొలిచెదునట్లు చేసి కడకుం దరిఁజేరఁగఁ దీసి వారలం
దలఁగొతిగించి కొట్టు మిరుదౌడలఁ॥ దిర్ప. ౧౨

చ॥ యశముపహించుఁ దక్షవిధి నబ్బిన నీ ఘనముద్రదాల్పుటం
బశువులుగూడ గోపతినమాఖ్యవహించి చరించెదుం నిరం
కుశగతి సంచరించునలగోవులఁ గావున నేరు నీకృపా
వశులు మహాత్త్వముం గననివారలు॥ తిర్ప. ౧౩

ఉ॥ నీయభిధానముద్ర గమనించెదుగోపతి కెవ్వఁడో సురా
పాయియొ జారుఁడో తులువ పాపి శఠాత్ముఁడు శుంఠ ముకుంద్రా
డో వ్వయఁ దలంచుఁ గాక యటువోయఁగ శక్యమె శక్యమే నిలం
జేయుల వారి నీవు నిరసింపవె? తిర్ప. ౧౪

ఉ॥ పేరునునూరు లేని పెఱవేల్పుల నామము నుగ్గడించినం
జేరెదుముష్టియుం దొరకఁ జెల్లదు గాని భవద్భటుండు నీ
పేరుపఠించుచుం బయలువెళ్లిన భుక్తికి లోటు లేదు నీ
పేరుమహత్త్వ మెంత వినిపింతును?॥ దిర్ప. ౧౫

ఉ॥ ముంగలివారు నీచరణపూజ యొనర్పక యున్నఁ దావకాం
శంగొను రామకృష్ణులను సైతము పూజ యొనర్పఁ బోవువా
రుం గలుఁగంగఁ బోరుగదె? రోయక వారిపిఁ గూడ నీవు నీ
బొంగుబుజానఁ బెట్టికొని పొమ్మనఁగఁ॥ తిర్ప. ౧౬

ఉ॥ నీపదముల్ భజించు నవినీతు లనేకులు దెల్వి వచ్చి వా
రాపని మానిరంటె? యిదియంతయు నీక్రమమేసి పాప మా
పూపలు రామకృష్ణులకు బొంగుబుజంబునఁ బెట్టి తోఁపయుం
జూపుచుఁ బొమ్మ నీవరుగుచోటికిఁ॥ దిర్ప. ౧౭

చ॥ "వరమును మీర లందఱు నుపాసన సేయుఁ" డటంచుఁ జెప్పి "య
ప్పరమవు నీవ" యంచనిన వ్యాసునిపై నిఁకఁ గోపమేల "నే

వరమును నీవుకా''వనుచు వాకొనువారల నొందఁగా నిరం
తరముగుదీక్ష నెల్లపుడుఁ దాల్పుము॥ తిర్ప. ౧౭

ఉ॥ జ్ఞానవిహీనగోతి, యదినైతము నీకథ వ్రాసె నింక వి
జ్ఞానముగల్గుపూరుషులు మానుదురే? మఱి గోతికన్నను
జ్ఞానములేనిమర్త్యుఁడు రసాస్థలమం దెవఁడేనియున్నచో
వీనికిఁగూడ గాథ వినిపింతును॥ దిర్ప. ౧౮

ఉ॥ "వ్యాసుఁడు కొలచేరుఁ"డని వాకొనుటెట్టిదొ "రామకృష్ణు ల
భ్యాసముచేసినారు సురపానము జారత"యంట యేముఖ
న్యాసమొ" గంగిరె"ద్దని మహాత్ములు నిన్నను టట్టిదే విప
ర్యాసముగాఁ దలంత్రు జడు లయ్యది॥ తిర్ప. ౨౦

చ॥ "కలవు రసప్రవాహము లఖండఘనాగమశృంగగౌరవం
బులుఁ గల వద్భుతాధికవిపోషణ జాతమహాఫలంబులుం
గల''వని యెంచి నీకలిమిగల్వరి తిర్పతితోడ; దాని మూ
ర్ఖు లెఱుఁగలేక గుట్ట యనుకొందురు॥ తిర్ప. ౨౧

ఉ॥ కనఁబడుఁ జిత్రధాతువులు గన్పడు సిద్ధపదంబులుఁగ సుదృ
గ్జనగణనీయవస్తువులుఁ గన్పడు దృశ్యములెల్లఁ దిర్పతిం
గనఁబడు బుద్ధిగల్గి సరిగా గుఱిగా గురుపాదసేవ సే
సిన యనఘాత్ములందఱికిఁ జిత్రము॥ తిర్ప. ౨౨

చ॥ "తిరుపతిఁబట్టి నీకుఁగల తేజ"మటంచును" నిన్నుఁబట్టియే
తిరుపతి"కంచు మూర్ఖులు వదింబదిఁ దంత్రము లెన్నియేని యే
ర్పఱచినఁగాని మీర లవి పాటి యొనర్పరు బ్రహ్మచేత నె
వ్వరు వ్రితి సేయఁగాఁ గలుగువారలు?॥ తిర్ప. ౨౩

ఉ॥ "ఱాయియు ఱప్ప,,యంచు నిను ఱవ్వయొనర్చుచు" నీకుఁ దేజముం
బోయె,,నటంచుఁ జెప్పె నెఱమూర్ఖులు తిర్పతి గ్రామసింహముం
జేయఁగ నీకు గొప్ప మహనీయత గూర్తు రెఱుంగరేమొ యీ
న్యాయము "రాత్రిభార్య వవ" లన్నని॥ తిర్ప. ౨౪

ఉ॥ ఏగిరియందు నీవు వసియింతువొ లీలలు చూపుచుందువో
యాగిరి వజ్రమైన జను లందఱు తిర్పతియంచు, దానితో

రోగమె కాని యేటికి విరాగము నీకు ఘటించు, "వీడినన్
భోగము లేదు నీ,,కనుట మూర్ఖత తిర్పతివేంకటేశ్వరా॥. ౨౫

చ॥ గురు వగుసీన్నుఁ గా వనుచుఁ గూయుటయే యొకతప్పు, దానిపై
గురువును బల్కరానివలుకుల్ వలికించు టిఁకొకక్రొత్తప్పు, దు
స్తర మగుపాప మిప్పగిది సారెకుఁ జేసెడివారికోన మే
నరకము క్రొత్త దేర్పఱచినాఁడవొ॥ తిర్ప ౨౬

చ॥ ఎవఁడు దశావతారముల నెత్తెను వాఁడవు నీవ, త్వత్ప్రలా
భవు లనికాదె వ్యాసుఁడు ప్రబంధములం దల రామకృష్ణుం
గవుల నుతించు, టీవు నొకకంటను గన్గొనుచుంటఁ బీఠికా
భవనమునం బ్రతిష్ఠ కనువట్టుట" తిర్ప. ౨౭

ఉ॥ "దేవుఁడ" వంచు నీకు వినుతిం బ్రణతిం బచరించువారె పో?
కోవిదు, లట్టికోవిదులకోసమె నీవిభవంబు సర్వమున్
గావలె నంచుఁ గోరుదువు కాని కటా! తెగనాడఁ జూతు వే
కావలువైన వారల దిగానరు॥ తిర్ప. ౨౮

ఉ॥ రాజితరాజరాజనగరంబు లనేకములందుఁ జెంది తే
వోజమెయిం బ్రతిష్ఠ, యది యుండఁగ నిమ్మటు మొన్న పొంది తే
రాజమహేంద్రమందిరవరమ్ముల మిన్నగు పీఠికాపురీ
రాజమహేంద్రమందిరవరంబునఁ॥ దిర్ప. ౨౯

ఉ॥ ఎల్లరు "నీవ యాదివతి వీత్రిజగంబుల,,కంచు నిన్ను వే
నోళ్ల నుతింపుచుండఁగ జనుల్ మఱికొందఱు 'నీకు స్తోత్రమే
చెల్ల"దటంచు నిన్ను నిరసింపఁగ సాగిరి స్వామి! యేమి యీ
యుల్లరి, పెట్టవీవు చెవినైనను॥ దిర్ప. ౩౦

ఉ॥ కర్ణమునందుఁ బెట్ట వనికాదు సుమీ వచియించు టింతగాఁ
బూర్ణముగాఁగ నించితివి ము; న్నదిచాలక యిప్డు తిగ్గి వ్యా
కీర్ణత నొందుచుండిరి నికృష్టులు వారలు తృప్తిలేక; వి
ద్యార్ణవ! తృప్తి సేయఁదగదా? యిఁకఁ॥ దిర్ప. ౩౧

ఉ॥ నేమముగోరి తిర్పతి వసించి ప్రసన్నతఁ దాల్చి సేవక
స్తోమసురద్రుమంబ వగుచున్ విలసిల్లెడి నిన్ను రామరా

మా! మహీ నేరొ దూఱుదురఁ టంతటిమాత్రన నీదుపిక్కపై
రోమముగూడఁ బోదని యెఱుంగుము॥ తిర్ప. ౩౨

ఉ॥ కింకరులై భవత్స్వ మొగిం బచరించెడి భక్తకోటి కే
కొంకునుజంకులేని కఱకుంవన మొక్కఁడొసంగి వైరితా
టంకవతీమనోహర నిటాలతటాలక కుంకుమప్రభా
వంకముఁ బావుశక్తి నిడువాఁడవు॥ తిర్ప. ౩౩

ఉ॥ "వంబిన వేడ్క నిన్ గొలుచు పార్థివు లజ్ఞు,,లటంచు, "నీకు న
ర్థంబు లొసంగువార" లపథంబునఁబోవుడివార"లంచు నై
చ్యంబు ఘటింత్రు పాలకునియందునఁగొందఱు "తిన్న యింటివా
సంబులు లెక్క పెట్టు,,సరసం బిది తిర్పతి వేంకటేశ్వరా॥ ౩౪

ఉ॥ ఆదట గల్గి విన్ను భవదంశసముద్భవులైన తామ్రక
ష్టాదుల కెందునైన జగమందున ముందు సపర్య చేసి యా
మీఁదను" నీవులే"వనఁగ మేకొనుదుర్మతు లుండ రున్న చో
మోఁదరె యోగ్యులెల్లఁ బనిముట్టునఁ॥ దిర్పతి

ఉ॥ వందలువేలుపద్యము లవారిగ నిం బడఁదిట్టుచుం గటా!
క్రిందనుమీఁదు గానక లిఖింతురు పత్రికలందుఁ గొంద ఱీ
చందముఁజూడ" వారిది దోసం"గని తోఁచదు వారికట్టిశ
క్తిం దయసేసినట్టి తమదే యది॥ తిర్ప. ౩౬

ఉ॥ "దాసులు సేసినట్టి పలుతప్పులనైన సహింతు"వంచుఁ "జే
రోమ్రసిన వాఁడవీ"వనుచు మోఱకులేగతి నిన్నుదూఱినన్
రోసముఁ జెందకుండుట "విరుద్ధమటం"చెవరేనియన్న నీ
చేసెడుకార్య మేమఱఁగఁ జెల్లను॥ దిర్ప. ౩౭

చ॥ శరణము నీమనోహరయశస్సరసీరుహవైరిమూర్తికిన్
శరణము నీమనోహరకనచ్ఛవిదంతురమూర్తికిన్ నమ
స్కరణము నీపదాంబుజయుగంబునకుం గయిమోడ్చుచుం బుర
స్కరణము నీదుభక్తుల కొసంగెదఁ॥దిర్ప. ౩౮

ఉ॥ మంగళమయ్య నీదుమహిమంబున కాయలమేలుమంగకున్
మంగళమయ్య నీకు కడుమాన్యత గూర్చిన యెమ్మెలాఁడికిన్

మంగళమయ్య నీగుడికి మంగళమయ్య భవద్భటాళికిన్
మంగళమయ్య నీ కొకనమస్కృతి॥ తిర్వ. ౩౯

ఉ॥ సేమము నీకు నీయనుఁగుశిష్యులకుం గుశలంబు నీదువి
ద్యామహనీయపద్ధతి కనామయ మాశ్రితసర్వదిక్తట
స్తోమనిరంకుశప్రబలసుందరకీర్తులతానతాంగికిన్
సేమము నీదుభక్తులకు సేమము॥ తిర్వ. ౪౦

ఉ॥ పాలకుఁ డాత్మకూరునరపాలుఁడు గ్రంథము వ్రాయఁజేసి యే
వేళను నీదునామము జపించుచు నిన్సదా భజించుచున్
గాలము వెళ్ళఁబుచ్చుచు సుఖంబుగ భోగములందుచుండె ని
న్నోలి భజింప లోప మొక టుండునె॥ తిర్వ. ౪౧

ఉ॥ "ఈవొక రాతిబొమ్మ"యని యెంతురు కాని నిజంబుగా మదిన్
భావనసేయుచో బయట వత్తువు దివ్యదఖండవైభవ
శ్రీవిజయస్వరూపమును జేకొని; మున్నొకపండితుండు నిన్
దేవర పెట్టఁగాఁ దలుపు దీయవె॥ తిర్వ. ౪౨

ఉ॥ నీప్రతిబింబచిత్రము లనేకము లుండనియింట లేవు నీ
సుప్రథితప్రబంధములు చూడనిరాగ్యులు లేరు వేల్పులన్
బ్రప్రథమంబు నీచరణపద్మతికిం దల యూనివారు లే
రప్రతిమప్రభావ! జగమందునఁ॥ దిర్వ. ౪౩

ఉ॥ పూచినమావిగున్న గతిఁబొల్చెడినీఘనవజ్రకంచుక
శ్రీ చెలువారువిగ్రహము చెల్వ గమం గొన లేక నోటికిన్
దోఁచినయట్లు ప్రేలుదురు ధూర్తులు వారలపాపసే మొ సం
కోచములేక చెప్ప వినఁగో రెడఁ॥ దిర్వతి ౪౪

ఉ॥ చిత్రమునందు శిల్పులు రచించినబొమ్మలు తల్లిదండ్రులున్
బుత్రులు మిత్రు లంచుఁ దలపోసెదువిప్పటివారు దివ్యచా

---

శ్లో॥ ఐశ్వర్యమదమత్తోఽసి మాం న జానాసి దుర్మతే
పరైః పరిభవే ప్రాప్తే మదధీనా తవ స్థితిః॥

రితు)ని దేవు విగ్రహము రీతిగ భావన సేయలేరఁటే
చిత్రము వింటివే మిగులఁ జిత్రము॥ తిర్పతి ౪౫

ఉ॥ రాజుల విగ్రహంబు గజరాజులపై నిడి యుత్సవంబులున్
బూజలు సేయు నిప్పటిజనుల్ గుడిలోఁగల వేల్పు బొమ్మకున్
బూజ నొనర్ప రాదనుట పోలదు గావున నెప్పు డేనియున్
బూజలు విగ్రహంబులకుఁ బోలును॥ దిర్పతి ౪౬

ఉ॥ తిట్టెడినోటికేని నిను "దేవుఁడ దేవుఁడ!" యన్న తిట్టెగ
న్పట్టును గాని వేఱు గనుపట్టదు మార్గము కాన నూరకే
వట్టిప్రలాపముల్ పలుకువారగల తిట్లఫలంబు వారినే
కొట్టెడు కాల మీవు కనుఁగొందువు॥ తిర్పతి ౪౭

ఉ॥ ఎప్పటినుండియో భువి వహింపుచునుంటివి కీర్తి, నెందఱో
కప్పము నిచ్చువా రలధికంబుగఁ దావకనామధారులై
యొప్పెడివారలెందఱో, యయారె! యెటువంటివి నీయశఃప్రభల్
'పెప్పెపెపెమ్మె పోలు?' పెకలింతురె॥ తిర్పతి ౪౮

ఉ॥ ఈవు నిజంబు దేవుఁడవయేని భవన్మహిమంబు సర్వభూ
మీవలయాలయంబులను మేటితనంబు వహించె నేని దు
ర్భవశుశౌచు నిన్నుఁ జెడఁ దిట్టినవారలమీఁదఁ జూపు మో
దేవర! తీవరంబు వెనుదీయక తిర్పతివెంకటేశ్వరా॥ ౪౯

ఇట్లు. శిష్టాహనుమచ్ఛాస్త్రి.

---

చ॥ తిరుపతివేంకటేశ్వరుఁడు దేవుఁడు కాఁడని నీవు "కాదు దే
వర యని నేను" లేదు పలుబండలలో నొకబండ" యంచు నీ
వురక యిదేటిపోఁత? మును ప్రాకట నాస్తికు నోరు నొక్కె శం
కరుఁ డది *"నాస్తిచే" త్తనెడి కారిక దానిఁ బఠింపు మర్థకా. ౫౦

(*శ్లో॥ నాఽస్తి చే న్నాఽస్తి నో హాని, రస్తి చే న్నాఽస్తికో హతః.)

(త్వత్కథార్థముల్ శ్రావ్యములై విపశ్చితులసంతసపెట్టును)

ఉ॥ *ఏమన నేర్తు నేమనిన నేమగుదో కొఱగాని? నృసింహభారతీ
స్వామి విపశ్చిదగ్రణియొకో? జంబుసమానుడొకో? యమ్మహాత్ముడెం
తే మునివంద్య నీగుణఖనిన్ వినుతించె విపత్పరంపరా
గాములలోకోని "విపశ్చి" దధికాగులు కాఱు శివేల పుత్రకా. ౭౪

(×శ్లో॥ శ్రీశేషశైలసునికేతన దివ్యమూర్తే, నారాయణాఽచ్యుత హరే నళి
నాయతాక్ష, లీలాకటాక్ష పరిరక్షితసర్వలోక, శ్రీవేంకటేశ మమ దేహి
కరావలంబమ్......శ్లో॥ తాపత్రయం హర విభో రభసాన్మురారే, సం
రక్ష మాం కరుణయా సరసీరుహాక్ష, మచ్ఛిష్య మప్యనుదినం పరిరక్ష
విష్ణో శ్రీవెం॥......శ్లో॥ శ్రీవేంకటేశ పదపంకజ షట్పదేన, శ్రీమన్నృ
సింహయతినా రచితం జగత్యాం, ఏతత్పఠంతి మనుజాః పురుషోత్త
మస్య, తే ప్రాప్నువంతి పరమాం పదవీం మురారేః.)

(ప్రాజ్ఞులు నుతింపగ)

శా॥ ‡భారద్వాజుడు మెచ్చె గౌతముడు సంభావించె నాకశ్యపుం
డారంభించె యజించె నత్రియును విశ్వామిత్రుడర్చించె మో
కారించెన్ జమదగ్ని, తక్కుఋషియున్ [illegible]వించె జోహారు; వం
దారుల్ సప్తఋషుల్ ప్రపన్నజనమందారుం డితం డర్భకా. ౭౫

(వేంకటేశ్వరశరణాగతిస్తోత్రమునుండి.)

(‡శ్లో॥ శేషాచలం సమాసాద్య కశ్యపాద్యా మహర్షయః, వేంకటేశం రమానా
థం శరణం ప్రాపు రంజసా, కలిసంతారకం ముఖ్యం స్తోత్రమేత
జ్జపేన్నరః, సప్తర్షివాక్ప్రసాదేన విష్ణుస్తస్మై ప్రసీదతి. కశ్యప
ఉవాచ॥ శ్లో॥ కాదిహ్రీమంతవిద్యాయాః ప్రాప్యైవ పరదేవతా, కలౌ
శ్రీవేంకటేశాఖ్యా తామహం శరణం భజే. అత్రిరువాచ॥ శ్లో॥ అ
కారాదిక్షకారాంత వర్ణైర్యః ప్రతిపాద్యతే, కలౌ స వేంకటేశాఖ్యః శ
రణం మే ఉమాపతిః. భరద్వాజ ఉవాచ॥ శ్లో॥ భగవాన్ భార్గవీ
కాంతో భక్తాభీప్సితదాయకః, భక్తస్య వేంకటేశాఖ్యో భరద్వాజస్య

వే గతిః. విశ్వామిత్ర ఉవాచ॥ శ్లో॥ విరాడ్విష్ణు ర్విధాతాచ విశ్వ
విజ్ఞాన విగ్రహః, విశ్వామిత్రస్య శరణం వేంకటేశో విభుస్సదా.
గౌతమ ఉవాచ॥ శ్లో॥ గౌ ర్గౌరీశప్రియో నిత్యం, గోవిందో గోపతి ర్వి
భుః, శరణం గౌతమస్యాఽస్తు, వేంకటాద్రిశిరోమణిః. జమదగ్ని
రువాచ॥ శ్లో॥ జగత్కర్తా జగద్భర్తా జగద్ధర్తా జగన్మయః, జమదగ్నేః
ప్రపన్నస్య జీవేశో వేంకటేశ్వరః. వసిష్ఠ ఉవాచ॥ శ్లో॥ వస్తువి
జ్ఞానమాత్రం య, న్నిర్విశేషం సుఖంచ సత్, తద్బ్రహ్మైవాఽహమ
స్మీతి, వేంకటేశం భజే సదా. శ్లో॥ సప్తర్షిరచితం స్తోత్రం సర్వ
దా యః పఠేన్నరః, సోఽభయం ప్రాప్నుయా త్సత్యం, సర్వత్ర విజ
యీ భవేత్। ఇతి శ్రీమత్సప్తర్షికృతవేంకటేశ్వరశరణాగతిస్తోత్రం.)

శా॥ *మార్కండేయు నెఱుంగుదే మునిమణిన్ ; మారారిలింగార్చనో
దర్కుం డాతఁడు విగ్రహార్చకుఁడు కాలాభీలపాశావళీ
కార్కశ్యంబు తృణీకరించె నలనత్కీర్తిష్ఠుఁ డాపుణ్యసం
పర్కన్ వేంకటనేతఁ గొల్చె నలఁతుల్ వాపోవ నేమయ్యెడున్. ౮౬

శ్రీ వేంకటేశ్వర వజ్రకవచస్తోత్రము, మార్కండేయఉవాచః

(*శ్లో॥ నారాయణం పరబ్రహ్మ సర్వకారణకారణం, ప్రపద్యే వేంకటేశా
ఖ్యం తదేవ కవచం మమ, సహస్రశీర్షా పురుషో వేంకటేశ శ్శిరోఽ
వతు, ప్రాణేశః ప్రాణనిలయః ప్రాణం రక్షతు మేహరిః, ఆకాశరా
ట్సురానాథ ఆత్మానం మే సదాఽవతు, దేవదేవోత్తమః పాయా
ద్దేహం మే వేంకటేశ్వరః, సర్వత్రసర్వకాలేషు మంగాంబాజాని రీ
శ్వరః, పాలయే న్మామకం కర్మ సాఫల్యంనః ప్రయచ్ఛతు, య ఏ
తద్వజ్రకవచ మభేద్యం వేంకటేశితుః, సాయంప్రాతః పఠేన్నిత్యం
మృత్యుం తరతి నిర్భయః॥ ఇతి మార్కండేయ కృతవజ్రకవచం
సంపూర్ణం

ఉ॥ ఉక్కునయందు సింగ మొకఁ డుద్భవ మందుట నమ్మెదేని "ఈ
యెక్కడ దేవుఁడెక్కడ" డనునెగ్గులు బొగ్గు లగుం గుమార? లే
దొక్కటికూడ దేవునకు నుండఁగ రానిప్రదేశ మందులో
నొక్కచోటు ముఖ్య మను నుక్తికి $గీతలె నమ్మతించెడిన్. ౮౭

(భగవద్గీతాదశమాధ్యాయమునుండి.)

*శ్లో॥ హంత తే కథయిష్యామి, దివ్యాహ్యాత్మ విభూతయః, ప్రాధాన్యతః కురు శ్రేష్ఠ నాఽస్త్యంతో విస్తరస్యమే, అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః, అహమాదిశ్చ మధ్యంచ భూతానామన్తఏవచ, ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్,... మేరుశ్శిఖరిణామహం,... సరసామస్మి సాగరః, ... స్థావరాణాంహిమాచలః, అశ్వత్థస్సర్వవృక్షాణామ్... ఆయుధానామహంవజ్రం... స్రోతసామస్మి జాహ్నవీ... మాసానాం మార్గశీర్షోఽస్మి ఋతూనాం కుసుమాకరః,..."  (ఇత్యాదిద్రష్టవ్యం)

ఉ॥ ఉక్కునుండి సత్కళలయుక్తులనుండి జలమ్ములనుండి నల్
దిక్కులనుండి పావనులదేహమునుండి స్వతఃప్రభూతముల్
ఋక్కులనుండి దేవుఁడు శరీరులకై యవతారమెత్తు దు
ర్వాక్కులె కాకయుండినఁ బురాణము లాగమముండు కారణముల్, ౮౮

క॥ కతిలేక తుదకుఁ "జీవన్మృతకుఁడగుచు నొకఁ డాశ్రయించి మితిమీఱి దురాగతముడిగట్టిన నినుఁగని, క్షితి నగవని యోగ్యు నొకనిఁ జెప్పంగలవే. ౮౯

($శ్లో॥ యస్స్వధర్మాత్పరిభ్రష్టో వృద్ధైశ్చైవ బహిష్కృతః, న జీవన్నేవ లోకేఽస్మిన్ మృత ఇత్యభిధీయతే॥ (విష్ణుపురాణవ్యాఖ్య చూ.)

(తిర్పతి గ్రామసింహము)

చ॥ తిరుపతి "గ్రామసింహ" మని తెల్లము సెల్లరకున్; సకారమున్
దురుసుతనానఁ జేర్చిరి సూరదిపూర్తిగ *మూఁత వెట్టున
శ్శ్రర;మగుఁగాక యేమి చెడుఁ గారుణికత్వము కల్మి వేంకటే
శ్వరగురుపాదరక్ష యది సాఁగఁగఁజేయుత నోరొప్పిరింబొరిన్. ౯౦

(* వకారస్యదన్త్యోష్ఠం, ఉపూపధ్మానీయానామోష్ఠౌ)(కౌముదిచూ)

ఉ॥ ఎందుకుఁ బ్రేలెదు రిఁక నేనియు నోటికి బుద్ధిఁ జెప్పికొ
మ్మందటు నీమొగమ్ము గనినప్పుడు చేసెఁ జేఁత యేమొ నే
నిందు లిఖింపనేల? యది యింతకుఁ బూర్వమె నీకు స్వానుభూ
తిం దెలియంగ వచ్చు గురుదేవనిందకు సైఁప రెవ్వరున్. ౯౦

(వేఱురీతి నెవు డీశతికార్థము)

చ॥ తనకపవాదలం బలికి తాండవ మాడుదుగాక యల్గఁ డా
యన; నగుచుండు "వీఁడెవఁడురా?" యని మున్నిటులాడి* తత్పద
ర్శనమున కగ్గమై శిరము సర్వము ముండితమైనమీఁద మ్రొ
క్కినజడు లెందఱున్ గనఁ డకించనులన్ మన వెంకఁ డర్భకా. ౯౧

(వేంకటాచలమాహాత్మ్యము 2, 3 ఆశ్వాసములనుండి.)

*(సీ॥ ..., నన్నెవ్వరేమియన్నను సహియింతు భక్తజనమ్మునన్న నేఁదాళ
లేను"...క॥ వరభక్తుల నిందించిన, నరులను గురుదూషకులను, న
మ్మినవారిఁ, జెఱిచిన పాపాత్మకులను, నరకంబునఁ ద్రోయుఁగాని
నావదమీయన్"...వ॥... దేవతలు చక్రరాజుశీర్షంబునఁ గుసుమవ
ర్షమ్ములు గురియించి...వినుతించియిట్లనిరి" సీ॥ చక్రరాజోత్తమ? స
కల పాపాత్ములసమయించి యిచ్చటిసాధువులను రక్షించితివి"...
సీ॥ వినుతించివలికిరో విమలాత్మ? యాదేశమందు ధర్మాత్ముఁడైనట్టిరా
జు, గలుగనికతన దుష్కర్ములై చోరులు బాధించుచుండిరి బ్రాహ్మ
ణులను, నీవుమాపాలిటిదేవుఁడవై వచ్చి సకలపాపాత్ములసంహరిం
చి, మమ్ము రక్షించి తిమ్మహిని బాలింపఁగాఁ దగినట్టి రాజుసద్ధరను
నిల్పు. తే॥ గీ॥ మనుచువారెల్లఁ బ్రార్థింపనపుడుచక్ర, రాజుతద్ధారు
ణికిఁ దగురాజునొకని, నిల్పి..."(విస్తరమందే చూడఁదగు)

(వందన మాచరించెదము)

ఉ॥ వందన మాచరించెదరె? బాగది మంచియుపాయమే విభుం
డందికొనండు వందనము లట్టివి కాని యెఱుంగ రేమొ? యే
చందపుశీర్షమున్ మొగిచి సామి కెరంగుట యొప్పునో యటుల్
సందరిసించి వందనము సల్పుఁ డఘం బిదియొల్లఁ బొల్లగున్. ౯౨

(భక్తితో వెండ్రుకలే నొసంగ కృప వెంచెదవు)

ఉ॥ ఎవ్వని* రెండు వెండ్రుకలు కృష్ణుఁడు రాముఁడుగూడ నయ్యె న
వ్వువిల్లు కానితండ్రికి "నమో" యనువట్టున నెత్తినున్న య
క్రొవ్వఁగావలెఁ గనుకఁ గొందురు ముండనమండనంబు నీ
విచ్చవరం బెఱుంగమి నెటే వదరం దొరకొంటి పర్భుకా. ౯3

(దేవీభాగవతచతుర్థస్కంధద్వావింశాధ్యాయమునుండి.)

(*శ్లో॥ యదా బ్రహ్మాదయో దేవాః ప్రార్థనార్థం హరింగతాః, హరిణాచ త
దాదత్తౌ కేశౌ ఖలు సితాఽసితౌ, శ్యామవర్ణస్తతః కృష్ణ శ్శ్వేతస్సంక
ర్షణస్తథా'' (అత్ర వ్యాఖ్యా.) సితాఽసితావితి, తథాచ కృష్ణః పూర్వోక్త
రీత్యా నారాయణస్యాఽ సితకేశస్యాఽ వతారః, బలరామస్తు శే
షస్య సితకేశస్యచాఽవతారః, అర్జునస్తు నరస్యైవ', (అపిచ విష్ణుపురా
ణే)'' శ్లో॥ ఏవం సంస్తూయమానస్తు భగవాన్ పరమేశ్వరః, ఉజ్జహా
రాత్మనః కేశౌ సితకృష్ణౌ మహామునే, ఉవాచ చ సురానేతౌ మత్కేశౌ వ
సుధాతలే, అవతీర్య .. '(అత్ర శ్రీధరీయవ్యాఖ్యాయాం'') మత్కేశౌ
వసుధాతలే అవతీర్యేత్యాది ద్రష్టవ్యం, నహి శ్రీధరవ్యాఖ్యా దేవీభాగవ
తవ్యాఖ్యాతో భిద్యతే, కింతు (విశిష్టాద్వైతిభిః రవిష్ణుచిత్తీయవ్యాఖ్యానే,) కే
శౌ, తేజసీ, క ఆత్మా తస్మిన్ శేత ఇతి కేశః, ఇతి క్లిష్టం వ్యాకరోత్, తత్ర
ప్రమాణాంతరంచ దత్తం, తథాఽపీదం 'అత్ర పూర్వమ్మహాదేవ, మిత్య
త్ర, అత్ర పూరు, అమ్మహాదేవ మితివత్ హృదయంగమం మన్యామ
హే, అపిచ మూలశ్లోకస్థస్య, ఉత్పాటనాఽర్థకస్య, ఉజ్జహారేత్యస్యాఽ
వ్యస్మిన్ పక్షే నైవ సామంజస్యమితి సర్వథా నిరస్యం, యది వా తథాఽపి స్వీ
క్రియేత, తత్రాపి 'సగర్వపథిరాః కవయ. ఇతికృత్వా వయమక్లిష్ట
మేవ వ్యాఖ్యానమాశ్రయామ ఇత్యలం విస్తరేణ.)

(బోధములేనికాల మది పోయెను)

ఉ॥ "బోధము లేని కాల మది పోయె" నటంచి వెవ్వఁడు నమ్మునో న
ర్వాధమమైన యిక్కలికి నక్క టని బోధము గూడ నేడ? యే

గాథలయందు నీతనికి$ గణ్యత నున్న భవాదృశుల్ మహా
సాధువు లిక్కలిస్థితికి సర్వధనంబుచుమీ కుమారకా. ౯౪

(విష్ణుపురాణషష్ఠాంశమునుండి.)

($శ్లో॥ వర్ణాఽఽశ్రమాచారవతీ ప్రవృత్తిర్నకలౌనృణాం,... వివాహానక
లౌధర్మ్యాన శిష్యగురుసంస్థితిః,... యోవైదదాతిబహుళంస్వంసస్వామీ
సదానృణాం, స్వామిత్వహేతు సంబంధో నచాఽభిజనతాతథా, ...
యదాయదాహి ధర్మస్యహాని ర్మైత్రేయలక్ష్యతే, తదాతదాకలేర్వృ
ద్ధిరనుమేయావిచక్షణైః, యదాయదాసతాంహాని ర్వేదమార్గాఽనుసా
రిణాం, తదాతదాకలేర్వృద్ధిరనుమేయావిచక్షణైః, ప్రారంభాశ్చావ
సీదంతి యదాధర్మభృతాం నృణాం, తదాఽనుమేయంప్రాధాన్యంక
లేర్మైత్రేయ పండితైః,...నప్రీతిర్వేదవాదేషు పాషండేషుయదారతిః,క
లేర్వృద్ధిస్తదాప్రాజ్ఞైరనుమేయావిచక్షణైః,...కిందేవైఃకింద్విజైర్వేదైః
కింశౌచేనాప్సుజన్మనా,ఇత్యేవంవిప్రవక్ష్యన్తి పాషండోపహతాజనాః)

మ॥ కృతగుర్వంఘ్రివిశేషకు లుజ్ఝితసుధీశ్రీకుల్ ఋతస్తోకు లా
దృతసర్వాగమవాకు లుప్తపితృమాతృప్రీతిసంఘాకు లూ
ర్జితసత్యవ్రతిభాకు లాచరితసుక్షేత్రైకయాత్రాకు లి
ప్పతితుం డాకలికిన్ విరోధులు సుమీ భ్రష్టుల్ కడున్ బందుగుల్. ౯౫

శా॥ ఏకాలమ్మును బాపకార్యములనే యీతండు ప్రేరేచు న్వ
ర్లోక మ్మన్నను జన్మమన్నను దదారూఢిఁ బ్రవర్తించు వే
దైకద్విష్టులు శిష్టు లన్న నితఁ డత్యంతమ్ము ద్వేషించు దు
ష్పాకుం డీకలి వీనియాకృతియుఁ *బాపప్రాయమ్మొ యర్భకా. ౯౬

(శ్రీనాథనైషధసప్తమాశ్వాసమునుండి.)

*ఆ॥ గగనమండలమునఁ గాలాయసవుఁదేర । మాలకాకిపడగ దూలియాడ......వ
చ్చువానినీలవర్ణదేహు॥ సీ॥..... బండికండెనతోడఁ బ్రతివచ్చునైచా
యసీలివచ్ఛదముతో మేలవింప...... తే॥ గీ॥ కోఱమీసాలు మిడిగుడ్లు
తుటుచపోడవు, డొప్పచెవులును గొగ్గిపండులునుగలిగి । యున్నమద్ది
పుఁడైవచ్చుచున్నవానిఁ । గలిమహారాజుఁ గనిరిదిక్పాలవరులు॥ క॥ హే

ళాబ్బృందారకుఁడగు । నాలవయౌగరాజుఁ గాంచినయనాంబుజముల్ ।
(వ్రాలిచిరినిర్జరేంద్రులు, మాలనిగనుగొన్నయుత్తమద్విజులక్రియలన్॥)

ఉ॥ ఆకృతిఁబట్టియే గుణము లబ్బెడి నందురు పెద్ద; లిట్టిభ్రి
ష్టాకృతి కెట్లు మంచిగుణ మబ్బెడి ద్వాపర మేగె నంత దు
ష్పాకుఁడు వీఁడు వచ్చెఁ బసిప్రాయ మెటో చనె బాల్య మేగు ని
ష్ఠీకలి కెట్లు బోధ మది యీతనికాలమునన్ జనించెడిన్. ౯౭

ఉ॥ భారతమందుఁ బేర్కొనెడిపాతకులన్ బ్రథముండు దుర్గుణ
శ్రీరమణుండు కౌరవకుశేశయశీతకరుండు దుర్యశ
శ్చారి $సుయోధనుం డితనిసారమె యేమనుకొంటివో! యెటుల్
గూరు సుబోధ మిక్కలికిఁ గొండొకవృద్ధి ఘటిల్లు నియ్యెడన్. ౯౮

($శ్లో॥ దుర్యోధనః కలేరంశః) (దేవీభా ౪ స్కం, ౨౨ అ, చూ)

చ॥ కలికలుషం బెఱుంగనియకాలపువెఱ్ఱు లబోధమున్ మదిం
దలఁతురు బోధ మంచు; విబుధప్రవరుల్ జడబుద్ధులైనయ
య్యలఁతులఁ జూచి 'యక్కటకటా! కలిగానికి లోఁగి వీరు త
ప్పుల కెర యైరిగా!' యనుచుఁ బొక్కుదు రేమియుఁ జేయనేరమిన్. ౯౯

ఉ॥ వీనియనంతరమ్మునఁ బ్రవేశమగున్ *యుగరాజు వానిలోఁ
దానెగడున్ సుబోధము; కృతజ్ఞు లెఱుంగుదు రీరహస్య, మా
శ్రీనిధి మున్ను మిన్నయుఁ బ్రసిద్ధుఁడునయ్యెనుకంటని ప్పుడే
మేనియుఁగాక యుక్తనకుమేత్కుణ తత్ప్రగతన్ వసించెడిన్. ౧౦౧

(* అనంతరంచాఽశేషకలేరవసానే నిశావసానే విబుద్ధానామివ తేషామేవ జనపదానాం, అమలస్ఫటికదళశుద్ధా మతయోభవిష్యంతి అత్రోచ్యతే॥ శ్లో॥ యథా చంద్రశ్చ సూర్యశ్చ తథా తిష్యో బృహస్పతిః, ఏకరాశౌ సమేష్యంతి తదా భవతి వై కృతం, (విష్ణుపురాణ చతుర్థాంశము చూ)

చ॥ కనుకఁ గలిన్ బ్రబోధ మది కల్గమి నిక్కువ మీవు పూర్వపు
న్మనులమతంబు రోసితివి మూర్ఖుఁడవైతి వటంచుఁ దేలె ము

ఘ్నుని గొనరింపరాని దోకక్రూరత యుండునె ? యమ్మఁ దిట్టు దే
వుఁ జెడఁదిట్టు దేశికునిఁ బూర్తిగఁ దిట్టెడిఁ దిట్టుఁ దండ్రినిన్. ౧౦౧

మ॥ కలిదోషం బిది దైవసృష్టి నతఁ డొక్కం డాతఁడేనిన్ జడా
త్ములయం దాడెడునట్లు పండితులయందుం దాండవం బాడఁ డీ
యలఁతిన్ వారలు లెక్క సేయరు మహార్హాచారపారంపరీ
స్థలదాచారులు వానిదాసులయి చక్కన్ బోదు రాచక్కికిన్. ౧౦౨

మ॥ కలి సంపూర్తిగ నైదువేలరిగె సాంకర్య మ్మెట్టుల్ దప్పది
వ్విలయమ్మందును *నిశ్చలాత్ములకు దుర్విజ్ఞానముల్ పుట్ట వి
ప్పలు కావ్యాసమహర్షి దేసుమి ? వృథా ప్రాగల్భ్యధౌరంధగీ
కులకోని సర్వయుగమ్ము లొక్కటియె సంకోచమ్ము లే దగ్భగా. ౧౦౩

(దేవీభాగవత షష్ఠస్కంధమునుండి.)

(*శ్లో॥ తస్మాత్కలిరనత్కర్తా, తస్మింస్తు తాదృశప్రజా, కదాచిద్దైవయోగా
త్తు ప్రాణినాం వ్యత్యయో భవేత్, కలౌ యే సాధవః కేచి ద్ద్వాపరే
సమ్భవన్తి తే,తథా త్రేతాయుగే కేచి త్కేచి త్సత్యయుగే తథా'' దు
ష్టా స్సత్యయుగే యేతు తే భవన్తి కలావపి'' (పూర్వోక్త వచనపర్యా
లోచనయా కృతత్రేతాదిపుణ్యయుగేషు హిరణ్యాక్షరావణాదిదుష్టవ
త్వ్వావప్రచురేఽపి కలియుగే కేచిత్పుణ్యప్రకృతికాః కుత్రచిదపి వర్త్తం
తఇతిచ, తేతావ న్నిశ్చలాత్మానో విద్వాంసఏవ భవితు మర్హన్తీ
త్యపిచ సిద్ధం భవతీతి ధ్యేయం.)

సీ॥ అకులీనుఁడగువారి నాశ్రయింపంగ విద్వజ్జనంబెపు డపత్రప వహించు
హద్దు మీఱినతనయానుజాదులవృద్ధ కెపుడుఃశిష్టకులమ్ము లిచ్చ రోయు
స్త్రీపునఃపరిణయవ్యాపార మెపుడుః నీచాతినీచమ్ముగా నరయుజగము
ఎపుడు కృతఘ్నుమో మీక్షించి విజ్ఞు లంబూకృతి ప్రవణతాముఖులౌదు.

తే॥ శ్రీ॥ రదిసుమీకుజ్జని బోధమున్నట్టికాల, మది గతించియెన్నే నేడులయ్యె నెఱుక
చాలనిభవాదృశులకు నిక్కాలమకటని, బోధముగలట్టికాలమ్మె పొలుపుమీఱె.

ఉ॥ బోధములేనికాల మది పోవుట చేతనె నూని వితంతుబిం
బాధరలన్ వరించు సుగుణాఢ్యులు వారల మన్నుపేరకుల్

శిథురతుల్ గుణారతులు శిష్టజనేతరు లెందు విగ్రహా
రాధకదూషకుల్ ధరఁ బరంగిరి మున్నిటు లుండ నేర్చిరే. ౧౦౫

సీ॥ తొలి ధనాఢ్యులకెల్లఁ దలలోనినాలుకలై యెందునాస్తికులు పెంపొంది రెలమి
మును ధనం బిసువారు ధన దాతలెల్లఁ "కళ్యాణంబు విధవానుయాయి, కన్య
బ్రహ్మవిద్వేషసంబంధమాత్రమున ముక్తజనులెల్ల మొక్కిక రెవ్వనికి నేని
అంత్యజాచార్యమతావలంబనమును వెనుకటివారు గైకొనిరి తఱుచు

గీ॥ ఇప్పుడును నట్టియుత్సాహ మెల్లయెడల
వ్యాప్తిఁ జెందెఁ జెందుచునుండె వ్యాప్తిఁ జెందఁ
గలదు సరిపెట్టుకొంద మికఁ గలుష మిట్లు
కాకశోకించి చేసెడికార్య మేమి. ౧౦౬

(వేఱురీతి...నీదుభోగముల్ ...నమ్రిత...నహింపఁగ)

చ॥ తిరువతి భోగి, యగ్గిరిసి దీప్తి నెసంగెడిసామి భోగి, నీ
వరయక భోగముల్ గిరిసి యాడఁ దొడంగితి "వేఱురీతి" నీ
*దురిత మడంగు శంకరునితో యుజనేత్ర స్మరింపు మాపె పా
దిరజము శ్రీశిగ జితము ధన్యునిఁ జేసినఁ జేయు నిన్నికన్. ౧౦౭

(దేవీభాగవత షష్ఠస్కంధమునుండి.)

* (జనమేజయః.) శ్లో॥ కలౌ వర్షబహుళే నరాణాం కా గతి ర్భవేత్,
...(వ్యాసః) ఏకఏవ మహారాజ తత్రోపాయో౽స్తి నాపరః, స
ర్వదోషనిరాసార్థం ధ్యాయేద్దేవీపదాంబుజం,.. ప్రాయశ్చిత్తంలు పా
పానాం శ్రీదేవీనామసంస్మృతిః")

ఉ॥ బ్రహ్మమతంబు నిప్పటికిఁ బట్టితి నాకిడ నున్నయప్పు డ
య్యబ్రహ్మప్రసాదమే గతి యథార్థము సెప్పుమని యా పెయాలయ
మ్మిమ్ముగ నుండి మాత్రజప మేగతిఁ జేసితి బిట్టినీపుని సొ
త్తమ్మున నిన్నుఁ బోలెడికృతఘ్నుఁడు లేఁడు సుమీ జగత్సునన్, ౧౦౮

ఉ॥ భోగము, భోగి, భోగితులు, వాల్చెడిశంకరునర్థమూర్తి యా
భాగిని మందభాగి నిను భర్తుని గాఁ దలపోసి నత్కలా

భోగిని గాన జ్ఞానలవభోగినిగా నొనరించె నిప్పుడే
లాగున దూష్యమయ్యెను శిలాప్రతిమార్చన మోకుమారకా. ౧౦౯

మ॥ భవితవ్యంబు నెఱుంగ నేరవు భవత్పాపోదయం బిట్లు వం
డవలెం గావున వేంకటేశగురుఁ డన్నా? *భోగినీరాగియై
భువి నెందున్ వినుతింపఁగాఁ బడెడిఁ దప్పంగూఁతలం గూయుచా
కవి కీలాటిమహారహస్యము లెఱుంగన్ శక్యమె ట్లయ్యెడిన్. ౧౧౦

(వేంకటాచలమాహాత్మ్యము, ౧ఆ, నుండి.)

*ఉ॥ కావున వేశ్యచందమును గైకొను మీవు హొయల్ చెలంగఁగా, నే
విటకానికై వడిని నిక్కుచు సొక్కుచు వచ్చి యచ్చటన్, బావకకుండ
మందు వప భక్తిని బ్రాహ్మణు లుంచినప్పుడే, యావవ నారగించెద బు
ధావళి మెచ్చఁగ నీవు చూడఁగన్"...సీ॥ ...తే॥ గీ॥ మురిసి విటవే
షధరుఁ డైనహరి హొయలుగఁ, జెలఁగి విటకత్తెవలె నుండు సిరిని
గూడి, పాదుకలు వెట్టికొనుచు నాప్రబలయజ్ఞ, వాటమును జూచువే
డ్కతో వచ్చుచుండె" (విస్తరమందే చూ)

మ॥ దురితం బీ వాడిఁ గట్టినప్పుడు భవద్ద్రోహమ్ము సర్వమ్ము నే
నెఱుఁగం జాలినయంతవట్టు నొడువన్ హేయమ్ముగాఁ జూడ రె
వ్వరు నల్లైనఁ గృతఘ్నతాఘ మొకఁడే వ్రాకుత్తు నన్యాఘమో?
§పరకీయాననవేయ మూరక వృథా భారమ్ము నాకేటికిన్. ౧౧౧

§ శా॥ చెల్లారెడ్డికిఁ దీసికట్టయితిమాచీ? మాట లింకేటికిన్ (ఈపద్యపా
మెవరికవిత్వమో, దీనిప్రసక్తికిం గలసంగతిసందర్భము లెట్టివో మా
శిష్యులు వెం॥ రా॥ లే చెప్పవలయును గాన వలయువారు వారివల
న నెఱుఁగఁదగు.)

చ॥ *గురుపితృమాతృదేవులతగుల్ వివరింపఁగ రాగు, భోగముల్
తిరుపతివేంకటేశ్వరుఁడు తేలనివాఁ డని కాదు, దాన నీ
గురుతకు భంగమేమి? యిది కొంటెతనంపుఁబ్రసంగ "మేల కొ
బ్బరితరు వెక్కె "దన్నఁ" దృణభారముకోన,, మటందువే సుతా. ౧౧౨

(*శ్లో॥ భవానీశంకరాదీనాం పిత్రోర్వా కేళివర్ణనమ్, (ఇత్యాదినిషేధ స్తా
వదలంకారశేఖరాద్యాలంకారికగ్రన్థేషు ద్రష్టవ్యః.)

చ॥ తిరుపతివెంకటేశగురుదేవుఁడు 'భోగి' యటన్నఁ దప్పొ "చి
త్తర మలవాఁడు దేవయ కృతఘ్నుఁ" డటన్నది తప్పొ? "నుంత నీ
వరయఁగ లేక పోతి" వని యాడుదు రీకవనమ్ము చూచి త
త్తఱపడినాఁడ వెయ్యదియు దారి గనంబడ కోయమాయె కా. ౧౦౩

(నీపదములేభజియించెడివారు గూడ... మున్పటివలె నిన్నుఁగొల్వరు)

చ॥ "తిరుపతివేంకటేశ్వరుఁడు దేవుఁడు మున్పువు డట్లు కాఁడు కొ
ల్వరు పలుమంది" యన్నదియె లాఘవమోకొ? "కృతఘ్నుఁ దలంపఁ డ
మ్ముఱ" కన లాఘవంబొకొ? కనఁ బోఁ డితఁ డందురు లోకు" లెంత త
త్తఱపడినాఁడ వెయ్యదియు దారి గనంబడ కోయమాయె కా. ౧౦౪

క॥ "దురితము లెన్ని కృతఘ్నత, సరివచ్చెడి? దానిఁ బెంచ సాఁగె నితఁడు వేఁ
దఱువాఁ" డంగురుసుమి త, త్తఱపడితివి దారి నుండు దగులక పుత్రా.

క॥ తిరుపతివెంకటభోగము, లెఱిఁగించితి యశము నురిఁగనేని యింతట, నె
వ్వరో తకర్కఁ గీర్తిపరులం దొగఁరె తాదృశులు విబుధపూర్వహులెందుఁ.

చ॥ ఇది యదిగాని నీవు ప్రల్లదము లెన్ని పరించినఁ దేలు సాగమీ
చదువుఁ గ్రొత్తగాఁ జెడు యశమ్మది లేశము లేద చాఁడయై
చదరయి నిల్చి యిప్పటికిఁ జాల దినమ్ములు పోవుదెంచె ని
య్యది గని యోర్వ లేనిజను లంతయు నుండిన నెంతనేద్దురో. ౧౦౭

చ॥ కావున నున్నకీర్తికె కావలె బోలెఁటుచోట నీవు నిం
దేవిధనేనిఁ గొంత గొను మీఁగల దాతఁడు నీకొనంగఁ గా
నావల నిల్చినట్టిదియె యాంతనకిక సరి పోవు "మానియే
పోవు నుపోవనీ? యశమపోని? కనుఁ గాఁడియు హేలు వక్షకా.

(*శ్లో॥ భాగ్యవన్తం ప్రసూయేథా, మాశూరం మాచపండితం, శూరాశ్చ కృ
తవిద్యాశ్చ వనమపుత్రా వనంగతాః" (ఇతిద్రౌపదీంప్రతికుంత్యా ఉక్తిః)

క॥ తఱుఁగు నిఁకఁ గీర్తి యనుకొని, పొరిఁబొరి లిఖియించితీవు బూతులు దానం
బెరిఁగెడినని భయపడు నతఁ, డగనితివే? హేతు వక్షకా? యిప్పట్లన్. ౧౧౦

